కబీరు:—వృత్తగీతము,

అమూల్యంబగు హరినామము నీ
నమ్ముచు నవలముఁ దెచ్చితివే? |
అమేయ రత్నము క్రయమున కిచ్చి
యదయుఁడ! రాతిని దెచ్చితివే? ||

2. రామ రామ నీ మోమునుఁ జూడగ
రాదుర యావలఁ దొలఁగుమురా |
ఏమని దీనినిఁ దక్షికి నిచ్చెదు
పామర యగ్గసి ముట్టకురా ||

ఓరీ! అవివేకీ! ఇంటికి నవలముఁ దెచ్చితివికదరా? విష్ణుదాసునకు రామ నామమును నమ్మి యాదవకుల ముసలమును దెచ్చితివే? వజ్రము నమ్మి రాతినిఁ దెచ్చితివే? కస్తూరి నమ్మి బూడిదెనుఁ దెచ్చితివే? అమృతము నమ్మి విషమును దెచ్చితివే? ఆ రాతిని చేత నంటకుము. క్రింద బెట్టుము.

కమాల్:—(రత్నము క్రిందవేయును.)

కబీరు:—కమాల్! దానిని నీవెట్లు తెచ్చితివో చెప్పుము.

కమాల్:—జనకా నేను దీనినిఁ జూడను లేదు—అడుగను లేదు—పుచ్చుకొనను లేదు—నా మూటలోని కిది యెట్లు వచ్చినదో యదియునుఁ దెలియదు. స్నానమునకై పంచెను విదిలించితిని—ఇది నేలఁబడెను—ఇప్పుడే దీనినిఁ జూచితిని—ఇంతకన్న వేరేమియు లేదు.

కబీరు:—సరి—అయినవైనది—దాని నిప్పుడే తీసుకొనిపోయి యా విష్ణుదాసున కొసఁగి పిదప స్నాన భోజనంబుల నొనరింపుము—ఒక గడియ యైనా యూరిలోఁ దడయక వెళ్ళిపొమ్ము.

కమాల్:—జనకా! రేపు నే నిక్కడ నుండకున్న నెట్లు?

కబీరు:—నీవెందు కుండవలెను?

కమాల్:—గుంపులు గుంపులుగ సాధువులు వచ్చియున్నారే?

కబీరు:—వచ్చిన నేమాయెను?

కమాల్:—వారు మన యతిథులే?

కబీరు:—వారిని నీవు తోడ్తెచ్చి యున్నాఁడవా?

కమాల్:—లేదు.

కబీరు:—నీవు వేరు విచారము మాని, మారు పలుకక పయనము గమ్ము—

కమాల్:—(పితరులకు నమస్కరించి నిష్క్రమించును)

ప్రవేశము శంభునాథం పత్రికతో

శంభు:—(కబీరు కుమాలులకు నమస్కరించి) గురుమహారాజ్! (అనిపత్రికఁజూచి) ఇట్టి పత్రికలు మీరు వ్రాసిపంపి యున్నారా? (అని పత్రిక నిచ్చును)

కబీరు:—(పత్రిక చేనఁక కిచ్చి) శంభునాథ్! దీనిని రాముడు వ్రాసినాఁడు.

శంభు:—సాధువులు సంఖ్యకుమీరి వచ్చుచున్నారు.

కబీరు:—రానిమ్ము, వచ్చిన నేమాయెను?

శంభు:—వారికి స్థలము-సంతర్పణము ఎట్లు?

కబీరు:—రాముఁడు చేసినట్లు.

శంభు:—నాకేమి సెలవు? నేనేమి చేయవలెను?

కబీరు:—నీవు నిశ్చింతగఁ బొమ్ము.

శంభు:—(నమస్కరించి నిష్క్రమించును)

ఖుషాలు:—నాథా! ఇదియేమి విచిత్రము?

కబీరు:—ఇది రామ లీలా విచిత్రము.

ఖుషాల్:—ఈ పత్రికల నెవ్వరు పంపియుండవచ్చును?

కబీరు:—రాముడు పంపినాడు.

ఖుషాల్:—నాథా! ద్రవ్యము లేదు – దుకాణములు తెఱవరు—కమాల్ తెచ్చినరత్నములతోఁగూడ వానిని యూరువెళ్ళ గొట్టితివి. ఆ సాధువులు గొంతులమీదఁ గూర్చున్నారు. అయ్యో! ఎట్టి సంకటకాలము వచ్చెను?

కబీరు:—కాంతా! ఇది మనకు మిక్కిలి సంతోషకాలము. ఒకవేళ యిది దుఃఖమని నీవు తలంతువేని కృష్ణభగవానుని వాక్యమను స్మరింపుము. "సుఖదుఃఖే సమేకృత్వా యుజ్యస్వ"

ఖుషాల్:—నాథా! నీవనిన తీరున నేననఁ జాలనే? నా కేమియు దిక్కు తోఁచకున్నది. ఇప్పుడేమిచేయుటకు సాధ్యమగును? నీవేమి యోచించెదవు?

కబీరు:—కాంతా! నేనేమియు యోచింపను. ఎవ్వరిని యాచింపను దేనికిని శోధింపను. ఆ యోచన యాచన శోచన లన్నియు నీశిరమునఁ గుమ్మరించి నాచేతులు శోధించి కూర్చుందును. ఆనాఁడే తెంచిన సాధువులయొక్క సత్కారమునకై నేనును కమాలును దొంగలైతిమి. మాయిద్దరి వంతు తీరినది. ఇది నీ వంతు. ఇది నీభారము. నీవు సమర్థురాలవని నాకుఁ దెలియును.

ఖుషాల్:—నీకెందుకు తెలియకుండును? సమర్థురాలను గాకున్న భావిలో దుమికి యాత్మహత్యకు యత్నింతునా? ఇప్పుడు సయితమాకృత్యమే చేసెదను.

కబీరు:—తరుణీ! ఇట్లేల భీరువైతివి?

ఖుషాలు:—నాథా! ఆడదానిని మఱేమిచేయగలను?

కబీరు:—కాంతామణీ! సద్విద్యయును, సత్ప్రవర్తనయుఁ గలసతి సామాన్య స్త్రీ కాదు. పురుషునకట్టి స్త్రీయే శక్తియై, సతియై వెలఁగును. సతి, తాను పరాధీనురాలని తలఁచుటచేతనే శమ-దమ-శాంతి నిగ్రహంబులను సాధించుకొనును. ఇట్టి నిగ్రహంబుగల పరాధీనతయే దీనత్వమును కలిగించును. దీనులగు వారికి భగవంతుఁడు రక్షకుఁడగును, అందుచేత సతి యుత్తమంబగు భక్తురాలగును. భగవానుఁడు భక్తి స్వాధీనుఁడగుటచేత భక్తియందే శక్తియుండును. భక్తి శక్తులవలననే ముక్తికలుగును. కావున సతియే ముక్తికి మూలకారణ మగును. ఈ తత్వమును గుఱుతించి నీవు భీతిల్లకుము.

ఖుషాలు:—నాథా! నీవేమి చెప్పినను నాకేమియో భయముగనే యున్నది.

పాట (అనుబంధము 35.)

కబీరు:—కాంతా! కృష్ణభగవానుఁ డర్జునున కుపదేశించిన యీ వాక్యము వినుము.

"క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వ య్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥"

పడఁతీ! ఈ పలుకుల నీ మనమున నిడి భీతిని విడనాడి, ప్రీతి ధైర్యంబు లొడఁగూడి రాముఁడు చూపు జాడయందు నీవు నడువుము. నీ వేమొనర్చినను నేను మారాడువాఁడను కాను. నీకు జయమగుఁ గాక.

(అని నిష్క్రమించును.)

ఖుషాల్:—అహా! ఇదెట్లు వచ్చెను? రామచంద్రా! నాపతిని, పుత్రునిఁ బరీక్షించినది చాలక నన్నుఁగూడ బరీక్షించెదవా? రామా! నేను స్త్రీనే? ఏమిచేయఁగలను-నిన్ను బాయక భజింపఁగలను కాని, సాహస కృత్య మింకేది నాకుసాధ్యమగును? రామచంద్రా! భూరిదయాసాంద్రా! ఇదిగో నా దేహ ప్రాణంబులను నీకు సమర్పించితిని. పాపము నీయది పుణ్యమునీయదె సుఖమునీయదె శోకమునీయదె ఏతెంచియుండు సాధువులు నీవె వారిని సత్కరించునది నీవె మాకు పరీభావము: గావింపఁ భావించి పరీక్షించువాఁడవు నీవె. రక్షించువాఁడవు నీవె. మృత్యువు నీవె. మను గడ నీవె. జానకీ నాథా! ఆనాఁడు నే నవివాహితనై యుండి, ఈ దేహమును నీ పాదముల కర్పించుటకు సిద్ధమై యుంటినే. ఏలనన్ను వారించితివి? ఈ వికార దేహమును గాపుమాపక, సంసారంబునఁ బడి సంతాప మొందునట్లు నాకేల పెండ్లి చేసితివి? నీ మంగళ విగ్రహ దర్శనము నాకేల నొసఁగితివి? ఇప్పుడు నీవు నన్నుఁ బాసి పోఁగలవా? నిన్ను నేను విడుతునా? వదలను.

పాట (అన బాషమున తె.)

రామా! ఏల నాం...స్వము జేసెదవు. నమ్మి నమ్మి, నేను రాని పోయితివేని, నా తల్లి సీతమ్మతో చెప్పి యేమాని నిన్ను వదలి నా యొద్దకు వచ్చునట్లు చేసెదను. రఘురామా! నీవు శత్రుని ప్రక్కనె రాక్షసుండైన రావణుండా నీ శక్తిని హరించి, నిన్ను నొంచి పరితపింపఁ జేసియుండగా, నీ భక్తురాలను నేను నిన్నేమి చేయఁజాలను? (నిలిచి విని) రామా! వచ్చితివా (అని మ్రొక్కి) శాంతి-శాంతి యనెదవా? ఏమనుకు?

(నిలచి) నీవు నన్ను రక్షించెదవా? నిజమేనా? నీ మాట నమ్ముదునా? (నిలచి చూచి) వలదు నీ వరహాలు నాకు వలదు. నీవునన్ను రక్షించునది నిజమూతామేనేని, నేను కోరిన దాని నివ్వవలయును. (నిలచి) రేపు సాధు సంతర్పణకు నవశ్యకంబగు సామగ్రి నాకు కావలయును. (నిలచి నవ్వుతో) ఏమి మాటయిది? రామా! పదునాల్గు లోకంబులే నీ చేతియందుండగ, పదివేల సాధువుల భుక్తికి కావలసిన సామగ్రి నీయొద్ద లేదా? మఱి యెవ్వరియొద్ద నున్నది? (నిలచి) ఏమి? విషయానందుని యొద్దనా? ఉండనీ-నాకేమి? (నిలచి) అవును, వాఁడు నా యన్నయే యగును. అయిన (నిలచి) నేను పోను. విషయానందుని నడుగను-వానికి నా ముఖమునే చూపను. (నిలచి) ఇప్పుడు విషయానందుఁడు నన్ను గురుతింపకున్నను, ఫకీరుని భార్య నాదరించు నంతటి ధర్మబుద్ధి వానికి లేదే! (నిలచి) నా ముఖమును జూచినవాఁడు నన్ను బీడించునా? అది యెట్లు శ్రీ రామా! (నిలచి) నేను పోయిన నంతయుఁ జెలియునా? పోవలయునా? పోదునా? (నిలచి భీతి వినయములతో) రామా! కోపగింపకుము. నా యవివేకమును మన్నింపుము. కన్నతండ్రి! బిక్షకై నా గ్రహించిన నా మొగతిచేము కావలయునా? (నిలచి) రామా! నిన్ను నమ్మి నీయాజ్ఞ చొప్పున నే ప్రవర్తించెదను. దేవా! రక్షింపుము, రక్షింపుము.

(అని నమస్కరించి లేచి)

సీ॥ రక్షింపరా; నన్ను రక్షింపరా రఘుసుర
బృందవందిత యానందరామ;
పాలింపరా; శ్రితపాలకా? సన్నుతా!
పూతచారిత్ర; సాకేతరామ

కాపాడరా; భక్తపాపాళి సంహర్త!
యోగి శరణ్య; యయోధ్య రామ
ధరియింపరా; కరిభరణ! యో మురవైరి
దశరథ పుత్ర! భద్రాద్రిరామ!

గీ॥ నమ్మితిని నిన్ను యో జగన్నాథ రామ!
తలతు సేవింతు నిన్ను కో-దండరామ!
క్షీర జలధి జామాత! శృం-గార రామ!
రమ్ము నా వెంట జానకీ-రమణ రామ!

పాట (అనుబంధము 40 పాడుచు నిష్క్రమించును)



## పంచమాంకము—ద్వితీయ రంగము.



(విషయుని ప్రవేశము)

విషయుఁడు:—అహా! మోహినీ! నీవెంతటి మోసకత్తెవే; నా బ్రతుకంతయు వ్యర్థము చేసితివి కదవే!

పాట (అనుబంధము 41.)

నా మాన ధనంబులు నీకు నప్పగించితిని. నీ యాజ్ఞానువర్తినై చరించితిని. ఆ పరమేశ్వరుండే దిగివచ్చి నాకుపదేశించినను త్యజింపఁ జాలనట్టి సురాపానానందమును నీ యొక్క మాటపైనన వదలితిని. నీవే నా కాంత, నా సంపద, నా సౌఖ్యము, నా ప్రాణమని నమ్మికొని యుంటిని. ఇట్టి నన్ను విడిచిపోవ నీకుఁ గాళ్లెట్లాడెనే? ఓసీ! దుష్ట

కాహళీ! ఎంతటిక్రైలాటకత్తెవే నీవు? నీవు మోహినివా? కామినీ రూప శాకినివి, నన్నుకాదని బైరాగి వానిని వెనుకొని మాసిన చీరఁగట్టుకొని తిరిగెదవు కూడు తిని, నాపేరున పాడుచేసితివి కదవే? ఓసీ! నీవంతగాఁ గులుకుచుఁ గబీరు నొద్దకుఁ బోయితివే? ఆబైరాగివాని భార్యకన్న నీవు సొగసైన దన్నికత్తెవనుకొన్నావా? ఆ కబీరుని కాంతయొక్క కాలి నఖము కాంతి, నీ ముఖమందున్నదా?

(అనికోపముంబూను.)

—:•ప్రవేశము ఖుషాలీ•:—

ఖుషాలు:—భాయీ! నమస్కారము.

విషయ:—(దిగ్గున లేచి చూచి) ఆహా! సుందరీ తలఁచినంతనే వచ్చితివా?

ఖుషాలు:—భాయీ! ఎవ్వరినిఁ దలఁచితివి?

విషయ:—రాం కబీరు భార్యయగు నాకీమణినిఁ దలఁచితిని.

ఖుషాలు:—భాయీ! నీవు నన్నేల తలఁచితివి?

విషయ:—మోహనాంగీ! నా మోహాగ్నిని నిందించు క్రోధంబున నిన్ను నిందించు నానందము పొందఁగ నిన్నుఁదలఁచితిని.

ఖుషాలు:—భాయీ! మహనీయురాలగు మోహినిని నిందింపనేల? నన్నుఁ దలంపనేల?

విషయ:—అది మహనీయురాలా? ఆ కులుకు కిల్బిషకీలా-కల్మషమ్ములు—వేశ్యాకుల హాలాహల—జ్వాల? అట్టి దుష్టురాలిని దూషింపని మనుష్యుఁడుండునా? ఇక నీవో ఆ పురందరాది దేవబృందముచే వందింపఁ దగిన సుందరివి కావా?

పాట (అనుబంధము 42)

తరుణీమణీ! నీ సరస శృంగారతరంగితంబగు నంగసౌభాగ్యం బును, శరచ్చంద్రికా సమానంబగు నీ ముఖ శోభనంబును, అభినవోజ్జ్వలబింబఫల సదృశంబగు నీయధర మాధుర్యంబు ను అనంతరత్నాయత కాంతియుక్త నీలోత్పలదళ సన్నిభం బులగు నీలోచనాపరిఫుల్లంబును, మీనకేతనుని మోహంపు పువ్వుల ముల్కులై తళుక్కులొత్తు నీ కేరగంటి చూపుల సొంపునింపుల నగ్గించి లగ్గించి, మమత తుఱంగలింప నీ మ హిమాండలంబును గందర్ప సామ్రాజ్య లక్ష్మీవిలాసము నలంకరించు సమయ సౌభాగ్య ధన్యవు నీవేకదా యని నిన్నుదలంచితిని. వెంటనే నీవువచ్చి నిలచితివి.

ఖుషాలు:—భాయి! నేనును నిన్నే తలంచి వచ్చితిని.

విషయ:—మేలు మేలు మీనాక్షి! ... (నిలవి) నీ పే రేమనవల యును?

ఖుషాలు:—భాయి! నా సఖుడు నన్ను "ఖుషాల్‌బీ" యని పిలుచు ను.

విషయ:—నాకిన్నే! నీవు ఖుషాల్—నాకు ఖుషాల్—ఖుషాల్! నీ వెంట నెవరైయినను వచ్చియున్నారా?

ఖుషాల్:—భాయి! కింకరీకి గనుపడువారు లెవ్వారును నా వెంట రాలేదు. నేనొక్క దాననే వచ్చియున్నాను.

విషయ:—ఇంకనంతియు ఖుషాల్! కాంతామణీ! నీవు నన్నుదలం చివచ్చితి వంటివి. అందులకు గారణమేమని నే నడుగవచ్చు నా?

ఖుషాల్:—భాయి! ఒక్కటి నిన్నడుగుటకే నేను వచ్చితిని.

విషయ:—తరుణీ! నేను కోరునదేయది. మొదలు కూర్చొను

ము. పిదప నొక్కటికాదు, వెయ్యి వేయుము.

ఖుషాల్:—(కూర్చుండును)

విషయ:—మోహనాంగీ! ఇపుడు నీమనస్సునకు వచ్చినది వేయుము.

ఖుషాల్:—భాయి! రేపు శ్రీరామోత్సవ సంతర్పణలకు వేలకొలఁది నాగరు లరుదెంచియుండుటచేతను, పురంబున నన్ని దుకాణములను మూసియుండుటచేతను శ్రీరాముఁడు పంపినందున నేను నీయింటి కీవేళయందు నిన్నుఁ దలఁచి వచ్చితిని. మాకు నూరు బ్రాహ్మభోజనసామగ్రి కావలయును. ఇదిగో పట్టిక. (అని పట్టిక నందిచ్చి) ఈసామగ్రి యీరాత్రియందే, యిప్పుడే బండ్లకువేసి రామమందిరముచెంతకు బంపుమని నిన్నడుగువాఁడను. ఏమందువు?

విషయ:—తిరుణే! అడుగవలదు. ఆజ్ఞాపింపుమని నేనందును. ఆవశ్యము పంపెదను. కాని ఖుషాల్! ఇందుల క్రయధనము విషయమేమని నేనడుగ వచ్చునా?

ఖుషాల్:—భాయీ! ఇప్పుడుకాని మరి యెప్పుడుకాని మాయొద్ద ధనము లేదు—ఉండదు—అయినను, నీగడియ కడనే నేని నీవడిగిన దినంబున నీ ధనమును మా రాముఁడిచ్చును. చెప్పుము నీధనము నీ కేనాఁడు కావలయును?

విషయ:—ఖుషాల్ నీ రామధనము, నా కామధనమునకు సమానమెంత మాత్రమునుకాదు. నా యిల్లంతయు నీకిచ్చినను దాని క్రయధనము నేనడుగను. నీవిచ్చినను నేను పుచ్చుకొనను. సుందరీ! ధనమునకు మారుగ నీ వచనమిమ్ము చాలును.

ఖుషాల్:—భాయీ! ఏమని వచనమీయవలయును?

విషయ:—సుందరీ! అడుగుదునా?

ఖుషాల్:—నిర్భయంబుగా నిస్సందేహముగ రాముఁ డడుగుమను దాని సహింతుము.

విషయ:—తరుణీ! నాకాముఁడు ధారి విడచినకథా నీ రాముఁడు నాయెడకు వచ్చునది? సుందరీ! ఇప్పుడే నేను నాకొట్టులోనుండు సామగ్రి సంతయుఁ బంపెదను. నీవు పోయి దాని నందుకొని వెంటనే యీరాత్రే మరలి నాయింటికి రావలయును.

ఖుషాల్:—భాయీ! వచ్చెదను.

విషయ:—వచ్చి, నాదేవుఁడు నాకుఁ గలిగించిన తాపమును దొలగించుటకు మారుని పూజచేయవలెను. తరుణీ! ఏమందువు?

ఖుషాల్:—భాయీ! నీవుచేయు యుపకారమునకు మారునిపూజ యొందుకు! మారుని అబ్బపూజ చేసెదను లెమ్ము.

విషయ:—శాబాస్ సుందరీ (అని ఆనందమున నెగిరి పడును)

ఖుషాల్:— పాట (అనుబంధము 43)

భాయీ! నేను పోయివచ్చెదను

విషయ:—నీలవేణీ! నీ విల్లుచేరువఱకు సామగ్రులు నీ రామ మందిరమును చేరినవని నమ్ముము.

ఖుషాల్!—భాయి: నేనును మఱలివచ్చితినని నమ్ముము.

విషయ:—తరుణీ! నాచేతిలోఁ జేయివేయుము.

ఖుషాల్:—(చెయ్యిఁదటి వెడలిపోవును)

విషయ:—(పరమానంద చిత్తుఁడై) ఓరీ! దస్తగీర్–ఆలంగీర్! షంషేర్–జాంగీర్–భువన్‌గీర్–ప్రతాప్‌గీర్–హమ్‌సేర్‌వీర్–రండి రండి (అని ఘుఅచి గొప్ప గంటను వాయించును)

ప్రవేశము సేవకులు ప్రవేశించుచు.

సేవకులు:—(సలాములుచేసి) సర్కార్ ఏమి హుకుం?

విషయ:—అరే! మీరు గుఱ్ఱముపేగముతో పారాడి పఱుగిడి గిర్ని నౌకర్లినందఱినిఁ బట్టుకొని బడాకోఠీ దర్వాజాలు తెరచి యందములోనుండు భోజన వస్తువులన్నిటిని బండ్లబండ్లకు వేసి రామమందిరము చేర్పవలెను ఇప్పుడు 5 గడియల రాత్రి యైయున్నది. 15 గడియల రాత్రియగులోపల సంతా ఫైసల్ కావలెను. వెళ్ళండి.

సేవకులు:—(సలాములుచేసి నిష్క్రమింతురు.)

పంచమాంకము—ప్రథమరంగము.



కీర్తనల ప్రవేశము పరశురాం శంభునాథ్.

పరశురాం:—శంభునాథ్! మన గురుమహారాజుగారి మహిమను నేడు ప్రత్యక్షముగ నేను కనుగొంటిని.

శంభు—పరశురాం! ఏమి కనుగొంటివి?

పరశు:—శంభునాథ్! వచ్చిన సాధువు లక్షలక్షలగను సంఘు సంఘుముగను కూర్పులుచేరి వేలకొలది రామమందిరము బైలునందున్నారు. రాంకబీరుగారు శ్రీగురుప్రాణాతో డను సంభాషించుచు భజన చేయుచు నున్నారు. మఱిగు గల వోట్లయందు నఖండముగ వంటలు సాగియున్నవి. పైన విగ్రహాలంకారములతో విచిత్రముగా గావించు చున్నారు. ఇందఱు పరిచారకు లేయూరినుండి వచ్చిరో వారెవ్వరో వే

ద్యము కాక చోద్యమై యున్నది. మన యూరివారు హిందువులు-తురకలు-యెఱుకలు-పఱుగెత్తి వచ్చి చూచిచూచి తెచ్చపడి పిచ్చివారై మరలి పోవుచున్నారు. నాకేమో యిదియంతయుఁ గలలోఁ గాంచినట్లున్నది.

శంభు:—పరశురాం! నన్నేల పిలువకపోతివి?

పరశు:—శంభూ! ఇప్పు డేమాయెను? రమ్ముపోవుదము? (ఇద్దఱు పోవుదురు)

(తెరపరదా పైకిఁ బోవును.)

విషయానందుని యిల్లు

విషయ:—(యోచనతో) నాకెందుకింత యనుమానము? ఖుషాల్ చేతిలో చేయివేసెను. అది తప్పక వచ్చును. అయినను నామదికి నొక్క విషయము మాత్రము దిక్కుమాలిన శంకను కలిగించుచున్నది. ఆభామామణి నన్ను "భాయి" "భాయి" యనియే కడవఱకు సంబోధించెను. నేను దానిని సుందరీ యంటిని. మోహనాంగి యంటిని. తుదకు ఖుషాల్ యంటిని. ఆ మాటవిని నాపై మనస్సులేక యుండెనేని నేను చేసిన యేకవచన సంబోధనలకు నాగ్రహించి నా నోరు నన్నడచే మూయించుచుండెను. ఇదియునుగాక, నేను నాచేతిలో చెయ్యి వేయుమని యడిగినప్పుడు సమ్మతించి నాచేయి ముట్టెను. పతివ్రత-అందున మహమ్మదీయస్త్రీ-పరపురుషునిఁ దాకునా? ఒంటరిగ రాత్రివేళ నన్యపురుషుని యింటికి వచ్చునా? కావున ఖుషాల్ నాకు వశమైనదనుటకు సందియమే లేదు. (అని మరల యోచించి) దీనితలగాల! ఈ "భాయి" సందేహము నన్ను విడువకుండ నంటుకొని యున్నదే! నేనొక తప్పిదము చేసినందున నింతగ మిడుకు

చున్నాను. ఆచెలువ నాచేతిని పట్టినప్పుడు నేను తటాలున ముద్దు పెట్టుకొనక పోతిని. ఆపనిచేసియుండిన నప్పుడే నా శంకానివృత్తి యగుచుండెను. అది లేదు. మా కులములోనే లేనిది నాకెట్లు వచ్చును; బేహారి నిఘంటువు నంతయు శోధించినను ధైర్యశబ్దమే కానరాదు. కాని యింకను సరిప్రాప్తము కాలేదు.

(ప్రవేశము—ఖుషాలు)

విషయ:—(ఆమెను చూచియానందమున) తరుణీ! నీవు నాముద్దు గుమ్మవే. ఆడిన పలుకును దక్కించుకొను చక్కని బొమ్మవే ఎంత త్వరగ వరుసెంచితివి? ప్రీతియన్న నిట్లుగదా యుండవలెను?

ఖుషాల్:—భాయి! నీకు నాపైనఁ బ్రీతి లేకపోయినను నాకు నీమీఁద ప్రీతి తప్పిపోవునా?

విషయ:—సుందరీ! నాకు నీమీఁద ప్రీతి లేదా? ఆప్రీతి యుండునది లేనిది నే నిపుడే చూచెదను. ఏదీ నీముద్దు నిమ్ము—(ముద్దుగొనఁబోవును)

ఖుషాల్:—భాయి! తాలిము—నీకు నాపైన నిట్టి ప్రీతి యెందుకు జనించెను?

విషయ:—తరుణీ! నీ మోమునందు ముద్దు కాఱుచున్నది. దానిని గ్రోలుటకుఁ బట్టఁజాలని ప్రీతి పుట్టుచున్నది.

ఖుషాల్:—భాయి! నీభార్య సుశీలయు నీమోహినియు నున్నారే? వారి మోములు నీకు ముద్దుగఁ గానరావా?

విషయ:—వారు మొదట ముద్దుగ నుండిరి. ఇప్పుడట్లు లేదు.

ఖుషాల్!—నీ సుశీలా మోహినులయొక్క ముఖము లేమయినను మాఱిపోయినవా?

విషయ:—వారి ముఖములేల మారును? ఉన్నట్లున్నవి.

ఖుషాల్:—భాయి! ముఖము లున్నట్లుండెనేని యందున దొలుత యొలుకుచుండిన ముద్దులిప్పుడేమాయెను.

విషయ:—ఆ తిరుగులకే తెలుసును. నాకుఁదెలియదు.

ఖుషాల్:—భాయి! నీ మనస్సును నీవు స్వాధీనమందుంచుకొంటి వేని, నీ భార్యకన్న నెక్కువ ముద్దువచ్చు వారుకాని, యానందము నిచ్చువారుకాని యెవ్వరును నుండరు.

విషయ:—ఖుషాల్! నా మనస్సు నీ స్వాధీన మయ్యే యున్నదే? నీ ముద్దు వెనుక నది దాచుకొని యున్నదే? నీవు ముద్దునిచ్చిన వెంటనే నదియును వచ్చును. (అనిసమీపించును.)

ఖుషాల్, విషయ } పాట (అనుబంధము 44)

విషయ;—ఖుషాల్! నీయెడనాకుఁగల ప్రీతిని నిరూపించుటకు నాకవకాశమిమ్ము. నా కౌఁగిటికి రమ్ము.

ఖుషాల్:—భాయి. దయలేని నీకుఁ బ్రీతియెట్లుండును.

విషయ:—ఖుషాల్! ఇక్కలందువు.

ఖుషాల్:—విషయా! నీకు

విషయ:—(ఆనందించి యెగిరిపడి) విషయా! విషయా! అబ్బ భాయి భాయి యనుచు చంపుచుంటివి. ఇప్పటికిని నీకు విషయాపేరు కలిగెనుకా? ఇంక బ్రతికితిని. ఖుషాల్! నాకు దయలేదనుటకు నేనేమి చేసితిని?

ఖుషాల్:—విషయా! నీకు "కుశల" యను చెల్లెలుండెనా?

విషయ:—నా చెల్లెలు కుశల ఉండెను.

ఖుషాల్:—ఆ కుశల యేమాయెను.

విషయ:—నా కుశల చిన్ననాఁడే నాయిల్లు విడిచి పారిపోయెను. మరల నామెరాను లేదు, నేను చూడను లేదు.

ఖుషాల్:—కుశల బ్రతికి యున్నదా?

విషయ:—నాకుఁ దెలియదు.

ఖుషాల్:—విచారించితివా?

విషయ:—నేనే వెదకితిని. వెదకించితిని. కుశలయొక్క పొలకువయే తెలియదాయెను.

ఖుషాల్:—కుశల రాకున్నను, నీవు చూడకున్న నెప్పుడైన నెక్కడైనను, కుశలయొక్క ధ్వనిని వింటివా?

విషయ:—లే...దు. సుందరాంగీ! నాకేమియుఁ దోచదు. నాకొక్కటియు స్మరణకురాదు. ఇంక దడయక మొదటికుఱ్ఱ నిమ్ము. పిదప నేమైన వచింపుము (అనియాతురపడును)

ఖుషాల్:—విషయా! అరక్షణము తాళుము. ఆతురము వలదు.

విషయ:—ఆ యరక్షణము తాళిన నా మరణమె యగును! ఇమ్ము! ఇమ్ము.

ఖుషాల్:—విషయా! నీవు సన్నేమి యడిగెదవు.

విషయ:—ఒక ముద్దు.

ఖుషాల్:—నీ చెల్లెలిముద్దును నీవెప్పుడైన నడిగి యుంటివా?

విషయ:—రామ. రామ. పాపము శాంతమగుగాక! ఖుషాల్! చెల్లెలి ముద్దునడుగు పాపాత్ముఁడెవ్వఁడైనను నుండునా?

ఖుషాల్:—ఉన్నాఁడు.

విషయ:—ఎచ్చట నున్నాఁడు.

ఖుషాల్:—ఇక్కడనే యున్నాఁడు.

విషయ:—ఎవ్వఁడు వాఁడు.

ఖుషాల్:—నీవే (అని ముసుఁగు తీసి తన కుశలారూపము జూపును)

విషయ:—కుశలా! కుశలా! నా ముద్దుల చెల్లెలా! నేను పాప

ను నీవుఁ బ్రహరించి నాకుదల్లివైతివి. (అని నమస్కరించును.) (కబీరుతో) యోగీంద్రా! రేపటిదినము జరుగనున్న శ్రీరామోత్సవముయొక్క ఫలమును నాకొసంగవలయును

కబీరు:—విజయా? అంతయు రామానుగ్రహమే రమ్ము పోవుదము నాయింటికి.

(అందరు రామకీర్తన జేయుచు నిష్క్రమింతురు.)

పంచమాంకము—ప్రథమరంగము.

ప్రదేశము హిందువుల రామోత్సవము.

మేళతాళములతో—ధ్వజముతో

పాత్రలు, విజయగుప్త—శంభునాథ—ప్రకాశరాం—మోహినీ—ప్రజలు

అందరు:—శ్రీరామచంద్ర మహారాజుకు జయమగుగాక.

ప్రవేశము రథసముతో మహమ్మదీయులు

మౌల్వీ:—అరే బాజావాలా! బంద్ కరో తేరా బాజాకు (అని మేళము నిలుపును)

శంభు:—(వాయించును)

మౌల్వీ:—అరే బేవకూఫ్ తుమారా గానా బంద్ కరో.

అందరు.—(వినక నడతురు)

మౌల్వీ:—అరే బేదీన్ బందర్కా అవులాదే! ఎన్నిదఫాలు మీకు చెప్పాలి? మాది మస్జిద్ దగ్గర మీ బాజాగానా గోనా మీజైబె హిందూకా జే. హై హై హంటాఘూస్కల్కే ఖోల్ ధారా? మీకు బుద్ధి ఉండాదా లేదా? హిందూకే గప్చుప్

నికల్ లేఖుంటే హెమ్నాకి చల్. మెహాళం ఆయుస్తే
మీాకీ ధకల్ ఖల్‌షిందా?

శంభు:—ఎందుకయ్యా మీా యాక్షేపణ? మీా యింటికి వచ్చితి
మా? మీా వాకిటికి వచ్చితిమా? మేము రాజవీధిలో మా
దేవతాయుత్సవమును జేయుచు బోవుచున్నాము. నీ గ్రు
డ్డిబెదిరింపులకు నేము భయపడువారము కాము. ఓరీ! మే
ళగాండ్లారా! వాయింపుడు మీా వాద్యములను.

మహమ్మ:—అరే మేళ్ళగాండ్లూ! ఖామూష్ హీ్యారీ మహాతల్కి
హాని మీా పేషుల్కి హెత్తిమూాధుల్యాకి ఫెత్తేకీహాంతే నోతి
షాదుల్‌కి ధుండుల్ గందుల్ పేస్తాకే మాలూం?

శంభు—సాహేబ్! మేము మావాద్యములతో నిదే దాటిగుండా
బోయెదము

మహమ్మ—అరే కాఫిర్ నీవు ముంధూకి ఖాల్ ఫిట్తివి హాంతే దా
స్కా నక్కియోస్తాం. ఖబర్‌దార్.

(ప్రవేశము రాజభటుండు)

రా॥భట:—(శంభునాథునితో) అయ్యలారా! ఏల వృథా జగడ మా
డెదరు? ఈవీధి విడచి యా ప్రక్కనుండు వీధిగుండ పొండు.

శంభు—అయ్యా మేము ముందుకుచేసిన మాదేవుని ముఖమును
వెనుక కెన్నటికిని త్రిప్పము. మహమ్మదీయులకు బుద్ధిచె
ప్పుము.

రా॥భట:—అయ్యా! ఎందుకింత యనర్థము చేయవలెను?

శంభు:—అయ్యా దాస్యపరా! అనర్థము చేయునది మేముకాదు. నీ
వే యనర్థములు చేయుచున్నావు. దేవునియొక్క భక్తులిద్ద
రవివేకులై గూా దేవుని పూజావిధానముననే జగడములాడి
చచ్చుచుండగా వారికి సహిష్ణుతనునేర్పి సమాధానము చే

యను శక్తి లేని రాజసేవకులెందుకయ్యా? నీవు పురరక్షకుఁ
డవు కావు, పూరీ భక్షకుఁడవు. మమ్ములను జూచి "ఈ
దారిఁ బోకు" డనిపలికినట్టియు దేనోటితోడ నా మహాత్ము
డీయులను జూచి, ఏరిని "పోనివ్వడు" అని చెప్పలేకపోయి
తివే? ఎందుకయ్యా ఈ నీచదాస్యమును చేయుచున్నా
డవు. మేము నీమాట వినము. నీ తాతమాటవినము. వె
నుకకుపోము—ప్రక్కకకు దిరుగము. ఇట్లనే చక్కగ బో
యెదము. అయినది కాని. ఓరీ వాద్యములను వాయింపుఁడు

పరిశేకము కబీరు

పాట (అనుబంధము 45)

కబీరు:—సోదరులారా! ఇదేటివివాదము? పరస్పర ప్రేమను ప్రద
ర్శించి, యిది దైవకార్యమే యని యొక్కటఁజేరి యేకభ
క్తితో భజింపవలసిన మీరు, శునకములవలె పనికిరాని
కలఁతల పాలగుచున్నారే? ఇందువలన మీకు సంతోష
మా? దేవునికి సంతోషమా? (మౌల్వీతో) మౌల్వీసాహెబ్!
అల్లాకాబందా హిందూహువా—ముసల్ మాన్ హువా—కో
యీ హువా—అప్నాఖుదాకేసాథ్ ఛద్ మత్ ఏఖుదా అదాకర్
రహాహై ఉస్కాంమే ఖలల్ కర్నేకాఖాల్ హలాల్ హై యా
హరాం హై ఆప్ హీ హాక్ ఫరమాయియె.

మౌల్వీ:—కబీర్ సాహెబ్! ఏక్ ఔర్ రివాజ్‌కే మామిలా హై—హం
[illegible] మస్జిద్ కా సామ్నె బాజాబజానేకా ద
[illegible] సహీ హై.

[illegible]—గురుదేవా [illegible] హిందూ మహమ్మదీయు
[illegible] విరుద్ధ [illegible]. మాదితిప్పద
[illegible] మాకును

తెలియదు. వారికిని తెలియదు. మేము శ్రీరాముని మో కుకొని వచ్చియున్నారము. ఈ దినముమాకుఁ బ్రాణముల పైన నాసలేదు. ఎన్నఁడైనఁ బోవుప్రాణముల నేఁడే మహమ్మదీయ సోదరుల చేతనే పోవనిచ్చెదము. ధర్మరక్షణము కొఱకుఁ గొందఱు మరణించిననే మిగిలిన వారికి క్షేమము కలుగును. మేమేమియుఁ గలహమునకు కాలుద్రువ్వము. వెనుకకు పొమ్మనిన పోవము. ఆరాముఁ డేమిచేసినను దాని ననుభవించెదము. (మేళగాండ్రతో) ఓరీ! వాద్యములు వాయింపుఁడు.

కబీరు:—సోదరా! ఉద్రేకము వలన నేమి ప్రయోజనము? నీవు తత్తరపాటున నాతురము జెందితివేని, యీ తురుష్క సోదరులు పోరునకు నిలచెదరు. అందుచేతఁ బ్రాణహత్య జరిగి యల్లకల్లోలమగును. శాంతముతో నీమహమ్మదీయ సోదరులను సమాధానపరచుటకు బ్రయత్నింపుము.

శంభు:—మంచి దాన్న! అట్లనేయొనర్చెదను. మౌల్వీసాహేబ్! మేము దేవతాయుత్సవమును జేయవలయునా లేదా? చెప్పుఁడు.

మౌల్వీ:—సేమ్ — పే క్యా—మీకీ దేవుడూ ఉంఛాడు మాకీదేవుడు ఉన్నాడు.

శంభు:—ఈ వీధిలో మాయుత్సవము పోవచ్చును కదా?

మౌల్వీ:—ఖుషీతో మీ ఉత్సావం తీస్కోని పోండి.

శంభు:—సాహేబ్? ఉత్సవముతో పోవునప్పుడు వాద్యములను వాయింప వలయును కదా?

మౌల్వీ:—ఇఛ్కా డానే మీకీమాకీ తకరార్ ఇఛ్కాడా మామసీద్ ఉంఛాధీ ఘన్కా ఈపోట మీ బాజాబంద్ బాకీపోట్ల మీపసంద్.

శంభు:—సాహేబ్! ఇచ్చట వాద్యములు వాయించిన దేవుడు మి మ్ములనుఁ గోపించునా యేమి?

మాల్వీ:—ఇఖ్కాడా మీరు బాజానిల్ఫితే ధేవుడు మీకీ ఖొట్టుఖా డా ఏమి?

శంభు:—సాహెబ్! దేవునికి వాద్యములు వాయించిన నొక్కటి యే, వాయింపకుండిన నొక్కటియే. భక్తియే కదా ము ఖ్యమైనది?

మాల్వీ:—హాఁ! హిట్లా ఛెప్పు. నేఁ హాలొప్పుకుంఠాఁ! హింఖా తెల్సీన మీరు హెందుఖూ హాధ్యం హాయిస్తారు?

శంభు:—సాహేబ్! శైవభక్తులగువారు తమ భక్తియొక్క యా నందమునందుఁ జేయునట్టి యనేక యుత్సాహ కా ర్యము లందిదియు నొక్కటి యగును. ప్రతిశైవభక్తునకును తన యిచ్చకొలఁది శైవపూజఁ జేయు స్వాతంత్ర్యము కలదు కదా?

మాల్వీ:—బేషక్ మీ హింట్లో మీ ఆఁట్లో మీకి స్వాతంత్ర్యం ఉంటాది. మాధి మసీదుక్ దగ్గర మాత్రం నోం ఛెప్పినట్లే హింనాలా?

శంభు:—సాహేబ్! ఇచ్చట మా వాద్యములు వాయించిన మీ కేమి నష్టము?

మాల్వీ:—నష్టం గిష్టం మూకీ హెర్గన్ హై. మా హిష్టం.

శంభు:—సాహెబ్! మీకు "యిష్టమున్నట్లు"—మాకును యిష్ట ము లేదా?

మాల్వీ:—అల్ బత్! మీకీ హిష్టం ఉంఠాధి—మాకి యిష్టం ఉంటాది. మీ యిష్టం మా యిష్టం జగ్డాలా నంకేనే ముష్కిల్ హ్యోగాం—మీ కీఖష్టం మాకీ ఖష్టం—దీని నుంచీ ధేపాన్కే నష్టం.

శంభు:—మార్లీవ్సాహెబ్! దేవతాపూజలు నుత్సవములను మీ యిష్టప్రకారము మీరుచేయుఁడు. మాయిష్టప్రకారము మేము చేసెదము. మీరుచేయునవి మేముగాని మేముచేయునవి మీరుగాని, యాక్షేపింపరాదు. ఇట్లయిన దేశక్షేమము కలుగును కదా?

మార్లీవ్:—హాఁ యిమ్యా! హిఁల్లాఖావాలా హానే పెద్దావాళ్ళుఖొట్టు ఖొంటారు. మీకి భుద్ధిలేదు. మాకీ భుద్ధిలేదు. మీకి షాంతిలేదు. మాకీషాంతీలేదు. పెద్ధావాళ్ళు పెప్పేధె మీజనాల్ భీ హినారు మాజనాల్ భి హినారు. హిప్పుడు మీరు దయాచేసి నాల్లు హాస్తులు ముందుకిపోయి బాజా బజాయింపండి.

శంభు:—మంచిది సాహెబ్ నేను మావారిని విచారించెదను.

మార్లీవ్:—అచ్ఛా! మీవాళ్ళకి హాస్త్. హిధి పమార్ఘం మాంతనీ నహొక్కాని మాంటఖావు నాహొక్కాని మాటఖాదు.

శంభు:—హిందూ సోదరులారా! ఇచ్చోట మనము వాద్యములను మాని యేగుదుమనడి బాగని నాకుఁ దోచుచున్నది మీకే మందురు?

హిందు:—వలదు వలదు, ఇది కానేరదు. వాద్యములు వాయించని చే శ్రీరాముని నిచ్చటినుండి మేము సాగింపము.

మార్లీవ్:—షాబ్బుషా హిందూ! నామాటు నిర్వాహంయనా? నేను మావాళ్ళకి హాస్తోఖాను: భాయిలో! ఖుదాకేవాస్తె బస్దాస్త్ కర్కే. హమారా హిందూ భాయోనాక జలూస్ బాజాకేసాత్ చల్నేకు. యిజాజత్ దీజియే.

మహ:—మార్లీవ్సాహెబ్! ఐసీబాత్ ముతలక్ నహిహోసక్తీ హమారా మసజిద్కా సామ్నే హిందోనాక బాజా బంద్

హోనాచాహియే.

మౌల్వీ:—(కబీరుతో) కబీర్ సాహెబ్! మై యకేలా క్యాకరుం. ఐసీమామిలా ఖుదా పసంద్ హోనేకా ఇవజ్ మే హం దోనోంకా జిద్ పసంద్ హోచుకా హై. తీసరా ఖుద్ పసంద్ న్యా జుదా పసంద్ ఖేల్ హోరా గయా హై. హిందూముసల్ మాన్ దోనోమే తమీజ్ సమఝ్ దార్ కంతర్ హై మజ్ నూస్ మజ్ హబ్ దార కసీర్ హైఁ, జై నామ సీహా నలహే కాక్ కా, నసీహత్ బేకార్ హై—మై అఫ సోస కర్తా హుం కే అప్ నే యహాం తక్ కదం రంజ్ ఫర్ మాయా మగర్ హంనే ఉస్ సే కోయీ ఫాయిదా నహీ ఉఠాయా. ఇస్ వక్ త్, మై ఖుదా ఎదస్ తగీర్ సె మఆమాంగ్ తాహుంకె, మారీఫత్ ఎ ఆప్ కా కుదరత్ ఎ ఖుదా జాహిర్ హోజా యెం. ఆవుర్ ఖూ రేజీ బాహిర్ రహ్ జాయె.

కబీరు:—(ఇంచుక ధ్యానపరవశుఁడై) మౌల్వీసాహెబ్: ఫర్ మాయియె అప్నా మస్ జిద్ కిస్ జాయిపర్ హై.

మౌల్వీ:—(ప్రక్కకుచూపి) యేహీ హమారా మస్జిద్.

కబీరు:—మస్జిద్ కా దర్వాజె కాహేకు బంద్ కియే హై?

మౌల్వీ:—లడాయీకి నౌబత్ హుంచాతో, హిందోన్ స్యే బాహిర్ హే రోక్నే కా గరజ్ సే హమారా షంస్ ఉల్ ఉల్మాసాహెబ్ నే అందర్ సె బంద్ కర్ లియా హై.

కబీరు:—మౌల్వీసాహెబ్. మై యెకీన్ సెకహ్తా హుంకె. ఇస్ జాగు మే లడాయి కుఛ్ నహీ హోగీ బర్ ఖిలాఫ్ యిస్కే లడాయికా మామిలాహీ ఫైసల్ హోజాయెగా. ఇస్ లియె మై అప్నా బుజుర్గ్ సే బాత్ కర్నా చాహ్తాహుం. మెహర్ బానీకర్కే దర్వాజా ఖుల్వాయియె.

మాల్వీ:—బహుత్ అచ్ఛా (అని తెరసుతట్టి) అరే అందర్ కౌన్ హై? జల్‌ద్ దర్వాజా ఖోలో.

(తెర యెగయబడును.)

పరిదర్శనము ఒకప్రక్క దేవళము అందు రామానందులు పూజ చేయుచు నుఱియొక్క ప్రక్క మసీదు అందున రసూలు నమాజు చేయుచు

రామానంద్ }
రసూల్ } ఒకరి నొకరు కౌఁగలించు కొందురు.

హిందువు:—జై సీతారాం మన రామానంద గురువులున్నారు (అని పోయి నమస్కరింతురు)

మహమ్మ:—అల్లాహో అక్బర్—హమారా హజ్రత్ రసూల్ యిధర్ హై (అనిపోయి సలాంచేయుదురు)

కబీరు:—పాట (అనుబంధము 45)

రసూల్:—వత్సా! కబీర్! భరత్ మాతాకు హిందూ ఔర్ ముసల్మాన్—దోనోంభి పుత్ర్ హోనేకా కారణసే ఇన్ దోనో బిరాదర్ హైఁ. అబ్ తక్ తుంకియాసా లోకసంగ్రహ్‌కా ఉపదేశ్‌సే ఇన్ దోనోంకా ఆంఖేఁతో ఖుల్ గయే హై. యహ ధాగే బచ్‌నే మై కష్టహుంకే. భరత్ ఖండ్ మె భవిష్యత్ కాల్ మె హిందూముసల్మాన్ మైసాహి ఝగడ్-తే ఝగడ్ తె ఆఖిర్ మె దేశక్షేంకా నాస్తే దోనో యెక్ దిల్ హోజాయింగే (జనులతో) ఆయ్! మేరా ము అజ్జిజ్ భాయియో! కహో ప్యార్ సే 'అల్లాహో అక్బర్' ఔర్ 'రాం హో రాంహే బర్'

అందఱు—అల్లాహో అక్బర్. రాం హో రాంహే బర్.

రామానంద:—

ఉ॥ నిర్మలమానసం బలరి నిష్ఠిత భూతదయా విహారివై
యర్మిలిబిహార పావన సుశాంచిత సాధుభయ పరిహారివై

కర్మలఁజిక్కి వానిచెఱఁ • గంపితులైన జనోపకారివై
ధర్ముఁడు రాం కబీరుఁడన • ధన్యుఁడనెతి సునామధారివై॥

వత్సా! కబీరా! నీవీ దేహంబున నీరాష్ట్రంబున నిక నెక్కువకాలముండరాదు. ఈ భారతీయులకుఁదగు నుపదేశమొనరించి వెడలిపొమ్ము.

కబీర:—గురురాజా! శ్రీరాముని చిత్తము. (జనులతో)

(పాట అనుబంధము 47.)

సోదరులారా! మన భరత భూమి భగవంతుని సృష్టిలో నత్యంత పుణ్య భూమియని మీ రెఱింగియు మఱచుచున్నారే

సీ॥ అరవింద నేత్రుని • యందంపు సతియైన
వరలక్ష్మి వాస మీ • భరతభూమి
అల రామచంద్రునిఁ • బలరామ కృష్ణులఁ
బడసిన సీమ యీ • భరతభూమి
వేద ధర్మములకు • విమల కర్మములకు
భవ్యనిధాన మీ • భరతభూమి
సాధు మహాత్ములఁ • సాధ్వీమ తల్లులఁ
బడసిన స్థాన మీ • భరతభూమి

గీ॥ స్వార్థపరులైన ధూర్తుల • నగము పడిన
చేలమున నున్న యానలమై • చెలఁగి వారి
చెడుగు క్రియలకుఁదగు చేటు • నొందఁజేయు
భారతీయుల కలిమి యీ • భరతభూమి॥

ఇట్టి పుణ్యభూమియైన మీరు జన్మించి నిర్విచారులై యొనరించు వ్యర్థకలహములవలన నెన్ని నష్టములు కలుగునో తెలుపుదు, కలహించి న్యాయ స్థానములకుఁ బోవుటచేత

ద్రవ్యనష్టము, జయాపజయముల గర్వహాతంబులచేత ప్రాణ నష్టము. అందుచేత ప్రజానష్టము స్వశక్తి నష్టము స్వాతంత్ర్యనష్టము దేశ నష్టము వీనికన్న నధికమైనట్టి దైవకృపానష్టము ఇన్ని హతాహతంబులను గణింపక తప్పు త్రోవలు త్రొక్కుచున్నారే.

హిందువు లెవ్వరు? మహమ్మదీయు లెవ్వరు? ఈజాతు లేమిటివి? ఈ మతము లేమిటివి? అని విచారింపుడు, మానవులగు మనకు దేవుఁడొక్కఁడే కదా? మనము జన్మించిన దేశములు వేఱై, భాషలు వేఱై, యాచరములు వేఱైయుండిన మాత్రముననే జాతి భేదములెంచి, విరోధింపవచ్చునా? దేవుని యెవ్వరెట్లు పూజించిన నేమి? ఇట్లుకాదు, అట్లు, అని యాక్షేపించువారి మతము హిందూమతము కాదు. మహమ్మదీయ మతమునుకాదు, అవివేకమతమగును.

అదిగో చూడుఁడు! మన తల్లి భరత మాత యెట్లు వెక్కి వెక్కి యేడ్చుచున్నదో అన్నలారా! మన తల్లి కన్నీళ్లను క్షారజలంబులతో కడుగనివ్వకుఁడు. పావన జాహ్నవీ జలముతోఁ గడుగుఁడు—అజ్ఞాన నిద్రనుండి మేల్కొనుఁడు. మాతృ శోకంబును జల్లార్చుటకు మీరందఱును చేతులు చేతులు కదియించి, కౌఁగలించి, కలహములను కక్షలను, కలుష క్షాంతులను ఖండించి, ప్రీతి నిండించి ధర్మ మార్గమునఁ బ్రయాణము సేయుఁడు.

హూల్వీ:—మేరా ముసల్మాన్ భాయియో! మహాత్మా కబీర్ సాహెబ్ పర్మాయాహై తక్ రీర్ సే మేరా దిల్ కాయిల్ మాకూల్ హోగా చుకీహై. హామరా జమాత్ కా యేక్ దిల్ రాయ్ జో హాయి ।సుకానా చాహతాహూం.

మహమ్మ:—మౌల్వీ సాహెబ్? ఆప్‌కే జోరాయ్‌హాయి వోహి మాంకు మగ జూతే హాయి.

మౌల్వీ:—బహుత్ ఖూబ్! (శంభుతో) భాయ్! పెంబునాక్! ఆప్‌కా మర్జీకే మాఫిక్ ఢోల్ తాల్ బాజాకేసాథ్ అప్నాజులూస్ నికల్ వాయియేగా.

శంభు:—మౌల్వీగారు! ఇప్పుడు మీరాడిన శాంత వచనంబులవలన మా మానసంబులకు సమాధానము కలిగిన కారణంబున మేము వాద్యములను మాని నిశ్శబ్దముగా మీ మనస్సులను నొప్పింపకుండ మీకు సంతోషము గలిగించి మేమును సంతోషముతోడనే మా యుత్సవమును ముందునకు సాగించెదము. (హిందువులతో) సోదరులారా! వాద్యములు మాని రామోత్సవమును జరిగించుటకు మీకేమందురు?

హిందు:—అవశ్యము కావచ్చును

మౌల్వీ:—జరా తయిర్ జాయియో! (కబీరుతో) కబీర్ సాహెబ్ హమారా కోయి హాక్ కత్ నయిసా బాత్, ఆప్‌కు ఖాతిర్ జమాతో హోగాయాచుకీనా?

కబీరు:—అల్లా! అల్లా! శాబాస్ అల్లా! (జనులతో) హిందూ మహమ్మదీయ సోదరులారా! సమాజకుల మహోపకారములు విదితములాయెను కదా? ఒక్క సమాజమువారుగు స్వమత దురభిమానంబున పరమత వైరత్వము నెంచి, యధికార బలంబు చూపట్టునట్లు "మీరా కార్యము చేయకూడదు" అని మఱియొక సమాజమువారితో పలికితిరేని, యెదుటివారికి స్వాభావిక స్వాతంత్ర్యము ప్రకటితమై "మేమీ కార్యమును చేసియే తీరెద"మని పట్టుగాబలికెదరు: కాని

యొక్క సమాజమువారు పరుల యెడ సోదరభావ సమానత్వము నెంచి, శాంతితోడ తమ సంప్రదాయము నివేదించి, వారిని గౌరవించి, యొరొప్పదహింస నిదానించిన పక్షమున నెదుటివారి మనస్సు మెత్తబడి, ప్రీతిచెలిమి, గౌరవము కలిగి, యెదుటివారి మదులకు హింసతోచునట్టి కార్యమెంత మాత్రమును చేయరని యిప్పుడు మీ మదులకు స్పష్టమైనది కదా? కావున మహమ్మదీయ సమాజము వారి మదులకు హింస కలుగు కార్యములను హిందువులు చేయకుండ ప్రవర్తింప వలయును. ఈ రీతిగనే హిందువుల మనులకు హింస గల్గించు కార్యములు నొనర్పకుండ మహమ్మదీయులు ప్రవర్తింపవలయును. ఇట్లయినచో పరమత సహిష్ణుతా ధర్మము స్థాపితమై, దేశమందంతయు ప్రేమ సౌఖ్యము తప్పక సంభవించును. ఈ వాక్యము సత్యమును మీరు మన్నింపక మీ మూర్ఖమునే సాధింతురేని యధర్మ దౌష్ట్యంబులు దుర్భరమై భగవంతుడే ధర్మోద్ధారణార్థ మవతరింపవలసి వచ్చును.

కం॥ ఎప్పుడు ధర్మము కడచని
ముప్పులకోర్వక జనములు మొఱపెట్టెదరో
యప్పుడు కమలారమణుడు
తప్పక తానవతరించి ధర్మము గాచున్॥

(అని సమాధియందు గూర్చున్నను)

రామా:—సోదరులారా! కబీరుడు సమాధియందే నిర్యాణుడగును. మీరు మీ స్థలములకు వెరలవచ్చును.

హిందు:—గురుపుంగవా! నిర్యాణాంతరము కబీరుగారి దేహమును మేము గొనిచనుటకు సెలవు వేడెదము.

మహా:—గురుమహారాజ్! కబీర్ మహాత్మాకా దేహాకు హం లే జానేకు పర్వానగీ ఫర్మాయియే

రామా:—సోదరులారా! మీ రిద్దఱును కబీరునియెడఁ బ్రేమను బ్రసరించి, యీ రీతిగఁ గోరుచున్నారు. కానిందు కబీరు డీరాత్రి నిర్యాణుఁడగును. నేఁనతని దేహమును భద్రపఱచెదను. రేపు మీ రుభయులు గలిసిరండు.

అందఱు.—అల్లాహో అక్బర్! రాంహో రహబర్!

(అని శబ్దించుచు నిష్క్రమింతురు.)



పంచమాంకము—పంచమ రంగము.

---

రామా
రసూలు } (కబీరు దేహముపైన వస్త్రమును గప్పియుందురు)

[ప్రవేశము హిందూ మహమ్మదీయులు]

రామా:—సోదరులారా! కబీరు దేహమును మీలో నెవ్వరుగాని [illegible]?

హిందూ: మహ:—గురుమహారాజ్! మీరే పరిష్కరింపవలయును.

రామా:—(రసూలుతో) రసూలుగారు! మీరుభయులును నా కబీరు దేహమును గొనిపోవ నభిలషించుచున్నారే! ఏమి చేయుదము?

రసూలు:—కబీర్‌కా షరీర్‌కు దో తుక్డే బనాకర్ హరదో ఏక్ హిస్సా దేజానా.

రామా:—సోదరులారా! కబీరు దేహమును రెండుగాఁ గోయుఁడు

హిందూ: మహ:—గురుమహారాజ్! ఆకార్యమును తామేచేసి మాకుఁ బంచియివ్వుఁడు.

రామా:—మంచిది (అని దేహము మీఁది ముసుఁగు దీయును)

(కబీరు దేహమునకు మారుగఁ తులసీ-పుష్పముల రాశియగుపడును)

హిందూ సోదరులారా! మీరు తులసిని, మహమ్మదీయ సోదరులారా! మీరు పుష్పాల రాశిని గైకొని మీ మీ యిష్టప్రకారము రెండు ప్రత్యేక సమాధుల నేర్పఱచి ధ్యానము భజింపుఁడు.

మహమ్మ:—అల్లా హో అక్బర్ (అని పూల రాశిని గొందురు)

హిందువు:—రాం హో రహబర్ (అని తులసి రాశిని గొందురు)

ఇద్దఱు:—

పాట మూ[illegible].

ఇద్దఱు.—అల్లా హో అక్బర్, రాం హో రహబర్
నేక్ దిల్ హోజాకర్ చలో చలో

రామానంద్ కు మహమద్ రసూల్ కు
రహీం రాంకు ఫతా ఫతా ॥అల్లా॥

హిం:—హిందూ ముసల్మాన భ్రాతలిద్దఱికి నెందును
కలుగును జయం జయం

మహ:—భారత్ ఖండ్ కీ బాషింగోం కు బరకత్
ఖ్వాహిం కు ఫతా ఫతా ॥అల్లా॥

హిం:—కలతలు పెంచుచు ఫలములు గోరెడు
కలుషాత్ములకున్ క్షయం క్షయం

మహా:—బీచ్ మే ఝుగ్‌డా మచ్ లగాకర్ నాచ్ నే
నీచ్ కు ఫనా ఫనా ॥అల్లా॥

హిం:—ఎక్కువ తక్కువ లెంచుచు పొగరున్న
సొక్కిన వారికి క్షయం క్షయం

మహా:—భారత్ లోక్ కు బర్ బాద్ చాహ్నా
బద్మాషోం కు ఫనా ఫనా ॥అల్లా॥

ఇద్దఱు:—యుగళ్ హోతో మిల్ కే దోనో మాతా
భారత్ మాతాకీ జై
జై జై హమారా భారత్ మాత్ కు
జై జై హిందూ ముసల్మాన్ కు ॥అల్లా॥

—◆ సమాప్తం ◆—

శ్రీ

# "రాంకబీర్" నాటకము.

## అనుబంధములు.

### అనుబంధము 1.

పాత్రములు:—  హిం|| భైరవి-పంజాబి అది తాళము

రామసుధామా! సుగుణారామ! రంజితనామా! నమో నమో!
ప్రేమానందవి రామా రామా కామాతీత! విభాసితనేమా!
రామా రామా!

2. ధీరవిచారా! వినోదనికరా! దేవ దయాపర దైత్యసంహారా!
సారాచార విహారా శూరా! నీరేజేక్షణ నీలసుందరా!
||రామా రామా||

కోరు:—  2. హిం|| [illegible] — [illegible] తాళము.

భజోరె శ్రీరామ చంద్రకానాం
భవబంధనకు తోడోరెభాయి భాగ్య భోగనాకాం||

1. భార్యాపుత్తర్ దౌలత్ అధికార్ బంధుదేహ పరివార్ .
భాయెురె సమఝోరె సబ్ హై బేకార్ భజన రామదర్ కార్||

2 ఝూటావందర్, కపట ముఖధ్యాన్ ఖోటా అందరమన్
లూట లూటకర జీవే దుర్జన్ ఘుటజావే; భగవాన్ ||భజోరె శ్రీ

కబీరు:— **3. యమున—ఆదితాళము**

హామబిగడే మోరె భాయి తూమె మతబిగడో రామదుహాయి॥

1 చంద్దనకేసంగత్ కటువాబిగడా
కటువా హోగయెచందన నగరా ॥హామ॥

2 సంతనకేసంగత్, కబీరా బిగడా
కబీరా హోగయె సంతన నగరా ॥హామ॥

కబీరు:— **4. పీలు—ఆదితాళము**

గురుకృపాంజన పాయోరె భాయి గురుచరనబినా భరనసపాయి॥

1 అందరరామ బాహిర రామ జంతెతూఖోలూతో ఆనందరామ

2 కహతకబీరా సునోమొరిగుణియె కరుణగురుమాబినా గ్యానన
పాయొ॥

రామానందభక్తులు:— **5. శ్రీరాగము—ఏకతాళము**

శ్రీరఘురామ పదార్చనపర శ్రీ రామానందగురో
వందన మానంద ప్రభో॥

1 భక్తులపాలిటి చింతామణినీ భజన మునిరతము సేయగా
భవశోకంబులు బలుపాపంబులు ఖలకర్మంబులు బాయుగా॥

2 పావనమాయెను మా జన్మము నీ పాదసరోజము గొలువగా
దేవదయాకర దివ్యప్రభాకర కావుము దీనుల మములగా

కబీరు:— **6. ధన్యాసి—ఆదితాళము**

జయ జయ గురువర జయ జయ శుభకర సమధిక శ్రీకర
భక్తపర॥

1 నాగురు రామానందస్వామికి వేగమొకలుగును విజయ సిరి॥

2 బాగుగ దారక మంత్రింబునుగొను భాగ్యముసౌఖ
లభించెనుగా ॥జయ జయ॥

కబీరు:— **7.** మోహన—రూపకము

ధన్యుఁడేను యోగివరుని దయకు పాత్రుఁడైతిని
మాన్యరీతినింక భువిని మనఁగ యోగ్యుఁడైతిని॥

1 పొందనాయె నేను మహా నందమైన భాగ్యము
చెందె రామచంద్రు సేవఁ జేయు పుణ్య భోగము॥

కబీరు:— **8.** ఫరజు—ఆది

దరశనబిన మూహి చైననహి రామ దరశన
చైననహి ఆరామనహి ॥రామ దరశన॥

1 తనుధనకాంచన సబలోతూహి
మనభి తూలేలో భువనక సాయి ॥దరశన॥

2 మనకిమలాలవో మమత నికాలో
దునియాకి బిషయ దుఃఖనికాలో ॥దరశన॥

3 కహత కబీరా కహాసునాతా
మహానందరామకా మహిమ దిఖాతా ॥దరశన॥

కబీరు:— **9.** సురటి—ఆదితాళము

జానకిరాం జజమార్ సాజగతిక సో నిగెబా ॥బాబా॥
జాహిల తోక్ దిలమే అనుమార్ ॥జానకిరా॥

1 రామహి ఆటా రామహిగోటీ రామహిమక్కరదూద్
రామఖిలాతా రామపిలాతా రామ మహాబల దాతా ॥బాబా

2 రామహిచఖ్ఖా రామఫిరాతా రామహి దేతానూత్
రామహిబజాతా పేటభరాతా రామహమారా త్రాతా ॥బాబా

కబీరు:— **10.** హిం॥ భైరవి—ఆది

మాయాజగతకా మోహభగాదో
మహబూబరామ పర్ మకు లగాదో॥

1 జోరూపాషవ్ హాఁ పుత్రర్ వ దుఃఖ్ తెర
సారాహై సంసార్ ప్రభుజీకదర్ బార్॥

19 రాముఁడు బాలుడై:— **11.** గౌళ—రూపక

దీనావన బిరుదును నేధరియింతు జానారగజగముఁగాతు ॥దీనా॥
1 శరణొందె కబీరుఁడునకు పరిపూతంబగు భక్తితో
పరికింపఁగను కిరాతుఁడు గుణమెఱుఁగడు కులమునుదొలఁగడు ॥దీనా
2 కృపఁగాంచె విభీషణుండు కపినాథుఁడు సుగ్రీవుఁడు
అపరాధుల రక్షించెద తపితుల కుపితుల తపసుల నృపతుల
కృపణుల శ్వపచుల ॥దీనావ॥

తమాల్ హలీం:— **12.** హిం॥ మిశ్ర—ఏక

హలీం:-కాంతా మనకీ వస్త్రమువలదు కోరకుమా మది నాలకుమా
తమా:-కాంతామణి నే దొంగిలలేదే మా రిక నాతోనాడకుమా
హలీం:-పోలదు నాథా యీమనము
తెమా.-చాలును కాంతా యీ చలము
1. హలీ:-రాజగృహంబున నుండెడి వస్త్రమె
తెమా.-ఓడగనింటనె చిక్కిన వస్త్రమె
హలీం:-రాజభటుల కిది చేకొన విత్తము
తమా.-భోజనమున కిక దేనిని దెత్తము॥

కబీరు:— **13.** దేహాగ్—ఆది

సోహీసంపద రామకధ్యాన్ సోనా పైసా సబ్ కిస్ కామ్
1 మాయా జగమే మానవజైతా ఛాయా సుఖసే సోయా
ఆయాజమజబ జాన్ కు భగాయామాలత సతిసుతతను ధనఖోయా॥
2 ఖాతిరసే ప్రభుకీ ర్తనబాజే కరిసక్ తా తూ కాల్ కుకరంగాల్
కహాతకబీర మస్తఫకీరా కచరాహైకుల్ జగకామాల్ ॥సోహీ॥

కబీరు:— **14.** మాండ్—హిందూస్తాని

హిందు ముసల్మాన్ ఫుజూల్ ఝుగడతే
యిన్‌కే ఘరహై హిందుస్తాన్
యిన్‌కే ఘరహై హిందుస్తాన్ బన్‌తె దోనో యేక్ హీజాన్॥
1 జిద్‌సే లడకర్ జాతే చునకం జిందగికరె బేకార్
బద్‌కామోన్‌సే దేశబిగాడే బర్‌బాద్‌హువా సబ్‌కారో
గార్ ॥హిందు॥

కబీరు.— **15.** హిం॥ పీలు ఆది

హారకతమతకరో గాయిపకడనే ధరొతో్రి హ్రృదయమె ధీరజకు
హారీసె హారకొయి కామ చలాహై కరెసబ ఉన్‌కా లీలాహై
మాతాగాయిపె హాతలగానా మక్‌దూరునహి బద్‌కారనకు
మనమే అనమాని ఛాండోరెనాదాన్
మజ్‌బూత్ దిల్‌సే బనోయిన్‌సాన్ ॥హార॥

గోరక్షకులు:— **16.** హిం॥ మిశ్రి మాండ్

రాం రాం సీతారాం రాం రాం జయ జయ రాం
1 గాలెలగాయ సాహెబ షేర్
గాయహమారా హోగాగయిషేర్
2 రామ బచాయ మాతాగాయి
రామ ఘుడాయా హాతెకసాయి॥
3 రామ నికాలా దిల్‌కా ఖట్‌కా
రామ హాకాలా గహిమంద్ ఉన్‌కా॥

కబీరు:— **17.** హిందుస్తాని ఆది

భజోరె రామనామ తేర భవభయహారన కరీమ ॥భజోరె॥
1 ఘడి ఘడీకు ఘటరహింజిందగి

కరోవఫానే ప్రభూక బందగీ॥ భజో

2 బ్యర్థపరిచారమె జీవన మతళ్

ఆత్మబిచారమె రామకు దేఖో ॥భజో

3 కహతకబీర కాటోర కహలత్

పహాఖానో తూ రామక దవలత్ ॥భజో

కబీరు:— **18.** కాపి ఆది

కిధర్ మేరా ఘర్ కిధర్ తేరా ఘర్

యేభి ఖుదాకా వోబి ఖుదాకా

1 అలమ భజకర్ శ్రీరామచందర్

కుచ్ నహీ తేరా కుచ్ నహీ మేరా ॥కి॥

2 కహత కబీర తమంకరో మోహాకు

కహతక పాలెతూ కష్టల దేహాకు ॥కి

కబీరు:— **19.** శంకరాభరణం ఆది

(మేర) పరవర ప్రియకిర పరమాత్మ రామా

ధరదియ ముఝపర్ దయతేర రామ

1 సీతానాయక మనమే ప్రీతసమాయా

పాతక హరనా ఖాతిర్ జమాయా

2 ఆనంద ప్రభో మేర అంఖే ఖులాయ

ఆత్మ సంధానమే ఐషదిలాయా ॥మేర॥

కళలా:— **20.** నాదనామక్రియ ఆది

ఈతాపమున నేను ధరపై సీతాపతే మకజాల

1 నిను నమ్మి భజనంబు నిరతంబు నేజేతు

నీరేజనయన హరీ నెనరున బ్రోవుము ॥ఈ॥

2 కలుషచరిత ననుచు గలిగె నాకపనింద
కరిరాజభరణ హరీ కరుణతో గావుము ॥ఈ

ముఖారి:— **21.** జిల్లా ఆది
పావనా నేడునా పాలిటి దైవము నీవెయికనా
కాపాడెడు నాథుడు నీవెయికనా ॥పా॥
1 పోలుపుగ నీపదసేవ నేను సలుపగ గోరుదానను
కలుషను నేనని చులుకన సేయక
కరముబట్టి నను బరిపాలింపుము ॥పావ॥

రేవతులు:— **21.** (a) ఆశీర్వాద గీతము
సుదినము నేడు రాం కబీరా సుదతికి నీకును సౌఖ్యంబౌ
ముదమగు నింకను ధరణీజనులకు వరవరదాయను శ్రేయంబౌ
శ్రీ రా ముం డు కా పా డును నిన్ ॥సుది॥

తిమాల్:— **22.** జిల్లా ఆది
శ్రీరామ జయరామ శృంగార రామా
రఘురామ శుభనామ రాజేంద్ర రామ
1 నాపాలి దైవమా కాపాడురామ
నీపాదకమలంబు నేగొల్తురామ ॥శ్రీ
2 అజ్ఞాన బుద్ధిచే ననలితినిరామ
సుజ్ఞాన సంధాన సుఖమిమ్ము రామ ॥శ్రీ
3 సంసార బంధంబు సడలింపురామ
కంసారి నన్నింక గనుగొంపు రామ ॥శ్రీ

ఖమాస్:— **22.** (a) కర్నాటక భైరవి రూపక
సనాతనా నిదానమూర్తి జయ జయ హారతీ
రామ హారతి రమేశ హారతి ॥స॥
1 సామగానలోల శీల సామజేంద్రపాలనా
సరోజనేత్రవామనా సురేంద్రవంద్య పావనా ॥స

2 కామకూర కనకహార కామపాల సాదరా
కరీంద్రధరణ శ్రీధరా కబీరపాలకా వర ॥స

కబీర్:— **23.** జంఝూటి ఆది

రామకసహీ భకతా జగమే కిసీకు నహిడర్తా
రంజ్ నహీ భయనహీ భకతనకు రంజనచితహై పక్తనకు ॥రా
1 జగతమెకయిదిన హామెక రోజేవన
ఛాండకచలనా ఆఖరయేకదిన
రాగభరేతో భోగకరేతో త్యాగభికరనా దేహాకు తూ
జాగతరామక ధ్యానకరె భాగతకాలభి తుఝుకుడరే ॥రా

కబీర్ — **24.** కాండ్

(కుచ్) దయాధర్మనహీ మనమే ముకుడా
క్యా దేఖతదర్పనమే ముకుడా
1 జీబసంభాలె తో జీవసంభాలె జబతకనహీ మిత్రాం
కహతకబీరా కహాలిక నేరా రహానాహైవాగా జగమే ముకుడా
క్యాదేఖత దర్పనమే ముకుడా ॥దయా॥

కబీకు అందరు:— **25.** యమున్ మిశ్ర భజన్ హిందీ ఏకతాల్
రామకరేగా రక్షణహామకు సమచితధరకె సిధారో
సమఝుకె మనమే భయకు ఉతారో సత్యతేరమ తహారో
రామ రామ శ్రితరక్షణావామా
రామ రామ శ్రీ రాజా రామా॥

కమాల్:— **26.** భన్యాసి ఆది

1 జానసెవాలా జానెగ ఆత్మకు-సాహేబ గుస్సా కెం తుఝుకు
గ్యాన నమిల్తా గ్రంథపఠనసే
ధ్యానసె రాంకా దమాకమాన్ జీ

కబీరు కమాల్:— **36.** (ii) [illegible]

కబీ:—హాయ్ కరీం హాయ్ కరీం దేఖ్ నసక్ తా నేహ జులుం
దేఖ్ నసక్ తా యేజులుం రోక్ నసక్తా మోహ గం ॥హా॥
కమాల్:—హై ఖుషాల్ హై ఖుషాల్ బీచ్ లగేసా చావల్
బీచ్ లగేసాచావల్ జేతలబ్ ఉస్కీహాల్ ॥హై॥
కబీ:—చల్తిచక్కి యాద్ దిలాతి మన్ నెవాలహాలత్
మన్ నెవాలహాలత్ మాత్ కీహాలాకత్ ॥హా॥
కమాల్:—చల్తిచక్కి ఛేక్ పసక్ తి రామకాభకరేకు
రామకాభకరేకు ప్రేమకాసకరేకు ॥చ॥

అందరు జనులు:— **37.** హిందీ భజన [illegible]

జానకీధవ రఘువంశోద్ధారి దానవ భంజన రామ మురారి
మునిజన పాలన ధీరబలారి వనరుహలోచన ఘనగుణశౌరి॥

ఖుషాల్ కబీరు:— **38.** యమన్ కల్యాణి ఆది

ఖుషా:—అనువగునా? యిట్టిమాట ననునేలాపంచెదు? ॥అను॥
కబీరు:—హితముగునే యింతినీకు ఇటులేలా భీతిల ॥హి॥
ఖుషా:—కనవె నేనొక కాంతనైతినే కడిది నోలనే కడగ
జాలనే కన్నగానలేని ననునేలాపంచెదు ॥అను॥
కబీ:—పరగుశక్తిని తెలియగనేరవే గరితవాదువె వెలవు
బాసువే సారథిరనీవే ॥ఇటులేలాభీతిల॥
ఖుషా:—తలంచిచూడ నీతరముగానినా కొలందిచాలునా?
వెలందిపోలునా; తామసింపనేనా? ననునేలాపంచెదు॥
కబీ:—పొలంతినీవిటు పలుకచెల్లదె వలనుతోచదే తలంతుగాంచెదే!
పోలురీతికాదె? ॥ఇటులేలాభీతిల॥

ఖుషాల్ బీ:— **39.** [illegible]

రామ నర బ్రోవగా రార రార నీవేగతి జానకీసతిపతి॥

1 కరుణము తోడుత దీనన్నుగావర్ధ కరివరదా నీచరణమ్మే నమ్మితి॥
2 ద్రౌపది మొరవిని కాపాడినహరి శ్రీపతినీపదములనే గొల్చితి॥

ఖుషాల్ :— **40.** అసావేరి

జానకిభానా మానవబచానా జానకివల్లభ పఖహై తేరా
జాతీహుంమై తోరిహీ సేవమె జతనభరణకరె భారతుమారా॥
రామభరోసా తేరా॥

సపయానంద:— **41.** ముఖారి ఆది

మోసముచే నను బాసిపోయెనే మోహిని పాపినియై॥
1 నారులు మనధనచోరులుకూ్రరులు నమ్మగరాదను వాక్యమును
నాడెందంబున బాటింపకనే నచ్చిమెలంగితిపోయెటక్కరి॥మో

సపయానంద:— **42.** హిం॥ కన్నడ ఆగ్ర

మన మోహిని! నీవె నా మోహిని
మానిని నీ ముఖ రమ్యముఁగాంచిన మన్మథుఁడే
నీ దాసుఁడగుట ॥మనమోహిని॥
1 పొలతిరె నినుఁజేఁ దిలకించుటకై పుణ్యంబెంతయొ చేసితిఁ
భళిరెభళిరె నినుబోలు సుందరు లీయిలలో నెందికఁగలరు ॥మ

ఖుషాల్ :— **43.** వసంత ఆది

భీతిని జెందగ నీకిటు తగునా వివేక మిడియగునా
వినియగుననుమానము నీమదిలోఁ బెనుపగ హితమగునా॥భీతి
1 మ ౕకు నింతగా దరమొందకుమా
మరు పితరునిదయ నరయుచు మనుమా ॥భీతి॥

ఖుషాల్ :— **44** హిం. మోహనమిశ్ర, ఏక

1 సరసకు రాకుర మరితవిచారా విరసపు ప్రీతిది
తరమగునేరా—సరియగు ప్రేమం బరయవదేరా?
సారమతీ—గాన—లేని చరితుండవని—నేగనుగొంటి
చాలునిక—జముఁడా—పోర ॥సరసకు॥

2 మనమునవ్రిమము ఘనత చెలంగగ జ్ఞానపడగ
లేని చెనటివిసీ వైకనునొనలేవే యు వగురీతిగ
మానసములోన నింక-మనుపణ దగునే-మేలగు శ్రీరీగ
మానుమునీ-తెలియగ-మూర్ఖా నరసకు

కబీరు:— **45.** ఖ్యా. ఆది

కోగ సమర్ఘానా మూఢజగతకు।
సత్యజ్ఞాన ప్రిసంగకు ఛాంపకె సత్యానాశకమార్గ మెలడ తె ॥కోగ
1 ముసల్మానహై ఖుదా కఫరజంగ్
హిందూకా భగవంతేక అవ్ లాద్
మూరఖ కలహాసే జందగినా బూద్ ॥కోగ॥
2 ఛాయొరెమతఖో జీవన తేరా భకుతిమె నహికుచ్ భేదబిచారా
భగవత సచ్చాభకతకసప్యారా ॥కోగ

కబీరు:— **46.** [illegible]

రామవొరహిమాగ నేకీహై భాయి।
నామహారదోనోమె ఖుదాసమాయి ॥రామ॥
1 దేవలమసజిద్, అల్లాకె [illegible]హై।
దేఖోరసూల్ రామా, నంద్ సే ఎతేహై ॥రామ॥
2 హిందుముసల్మాగ లడ్ తేహైఝూటే।
భారతమాతీకే దోనోహై బేటే ॥రామ॥
3 కహాత కబీరా సునోమోరెభాయి।
దేశ, వినాశకర దేతీ లడాయి ॥రామ॥

కబీరు: **47.** [illegible] —ఆది

తుమమే తుమమే గాహెకు ఝగడ
దుష్మనిదిల్ కా కరదేవ్ తుకడ ॥తుమమే॥
ఠాకురద్వారమే, బొమ్మన హైతా మక్కా-అందర సిజదారా।
ఏకగురూకా దోహెచేలే ఏకపూజారి ఏకనమాజి ॥తుమమే॥



